## పీఠిక.

అయ్యా! ఆశీర్వచనమనఁగా శుభవచనమనియర్థము. మన దేశమున బ్రాహ్మ
ణోత్తములు ఆయుర్దాయము ఆరోగ్యము ధనము సంతానము మొదల
గు శుభఫలములను కోరుచు ఇంద్రుడు సూర్యుడు అగ్ని మొదలగు దేవ
తలను ప్రార్థించుచున్నట్టి శ్రుతులను (పనసలు) చదువుచు నాశీర్వదింపు
చున్నారు. మఱియునట్టి శ్రుతులందు క్రమము జట ఘనము మొదలగు లక్ష
ణప్రోక్తపాఠవిశేషములచే శ్రవణానందమగునట్లు నుచ్చరింపఁబడుచు
న్నవి. తరుచుగ మనవారు వాడుక చేయుచున్న శ్రుతులకర్థము దెలిసికొ
నుటయావశ్యకమని యీచిన్న పుస్తకమును వ్రాసినాడను. సాధ్యమగు
నంతవఱకు ముఖ్యాభిప్రాయమును సంగ్రహించి ప్రాచీనభాష్యానుసారము
గ చేర్పంబడెను. రెండుమూడు పదముల ననేకపర్యాయములుచ్చరింపవల

సినజటఘన మొదలగు పాఠభేదములకుఁ బ్రతిపదార్థము వ్రాసిననో పిచ్చి వాని సంభాషణమువలె నుండునని మూలమునకే టీక వ్రాయఁబడినది గ్రంథమందు ప్రమాదములున్నచో పండితులు మన్నింపఁ బ్రార్థితులు.

లక్ష్మీనరసుపేట<br>గంజాంజిల్లా }

ఇట్లు,<br>పారనంది సర్వేశ్వరశాస్త్రి.



శ్రీరామాయనమః.

# ఆశీర్వచనమంత్రాష్టకము.



శ్లో॥ ఇందీవరాభం శ్రీరామం సుందరవక్త్రికం । ఇందిరాచిత్తకమలం నౌమి రామానుజం ॥

ఋక్సంహిత (2-2-22)

ఓం॥ ఇంద్రశ్రేష్ఠాని ద్రవిణాని ధేహి చిత్తిం దక్షస్య సుభగత్వమస్మే । పోషంరయీణామరిష్టింతనూనాం స్వాద్మానంవాచస్సుదినత్వమహ్నామ్॥

టీ॥ హే ఇంద్ర! ఓయింద్రుడా! (నీవు) శ్రేష్ఠాని=ఉత్తమములైన, ద్రవిణాని= సువర్ణరత్నాది ధనములను అస్మే=మాకొఱకు, ధేహి=ఉంచుము మా(దూయు.దుఉంచవలయు

(దీనిముద్రణము విస్తృతముగ ప్రకటింపబడియున్నది. ఇదిమిగుల వాక్యవచనము చేరక పోయినను యాజ్ఞికపండితులచే పఠింపబడుచున్నది. దీనికి నిరుక్తమువలె చదువుచున్న ప్రతీకప్రగ్రంధము నీదిగువవ్రాయుచున్నాము. యాస్కాచార్యులవారిచే నిరుక్తశాస్త్రమున చెప్పుటను నిది నిర్వచింపబడియుండలేదు.

## ప్రతీకనిరుక్తము.

భద్రో రామభద్రో భద్రయా మంగళరూపయా సీతయాసహ వానరస్య పద్యమానస్య హనుమతా దాగాత్ప్రీతుష్టి యోగవశాదరణ్యాము గాజ్ఞారః పరదారాహర్తా రావణ స్స్వనగరం మాత్రనత్స్వాపహృత్యాం జగన్మాతరం సీతాం పశ్చాదస్యైశ్వర్యగన్యా గమనానంతరం సేతుబంధనద్వారా రావణేహతే సీతాయాం చాగ్నౌప్రవిష్టాయాం విశ్వాసార్థమగ్నిస్తాం గృహీత్వా గామం రాఘవ మభ్యాభిముఖ్యేన ప్రాప్తాం శుద్ధేత్యభిని వేదితవాన్।

తతస్సప్రకాశైస్సకలార్తిహారిభిస్స్వభిః కాన్తివిశేషైరుశద్భిః కమనీయాభిర్వర్ణాకారాదివిశేషైస్స్వవిశిష్టస్వశేషేణయుక్తవాక్॥ ఇందురామాయణకథసూచింపఁబడుచున్నది.

యజుర్వేద సంహిత.

(1 కాండము 3 ప్రపాఠకము 14 అనువాకము.)

5 ఓం ఆయుర్దా అగ్నే హవిషో జుషాణో ఘృతప్రతీకో ఘృతయోనిరేధి। ఘృతంపీత్వా మధుచారుగవ్యం పితేవపుత్రమభిరక్షతాదిమం॥

టీ॥ హే అగ్నే=ఓయగ్నిహోత్రుఁడా! (నీవు) ఆయుర్దాః=యజమానుని కాయుర్దాయము నిచ్చువాడవు, ఏధి=కమ్ము, హవిషోజుషాణః=పురోడాశమును సేవించుచున్నట్టియు, ఘృతప్రతీకః=ఘృతయోనిః= యజ్ఞములకు ముఖ్యప్రయాజానూయాజ అవాంతరోపచ్చారణ ప్రాయశ్చిత్తకములగు యాగాద్యనుష్ఠానములయందు ఘృతముచే హోమము చేయఁబడుచుండినట్టియు (ఘృతముతోఁ గూడినవాఁడవగు నీవు) మధు=మధురమైనట్టిదియు, చారు=నిర్మలమైన, గవ్యం=ఘృ

తం= గోఘృతమును, పిత్వా=పానముచేసి, పితా=తండ్రి, పుత్రమివ= కుమారునివలె, ఇమం= ఈయజమానుని, అభిరక్షతాత్ = సంరక్షించును.

సంహిత 2 కాండము 4 ప్రపాఠకము 14 అనువాకము.

6 నవోనవో భవతి జాయమానో౽హ్నాం కేతురుషసామేత్యగ్రే ।
భాగం దేవేభ్యో విదధాత్యాయన్ ప్రచంద్రమాస్తిరతి దీర్ఘమాయుః॥

టీ॥ చంద్రమాః=చంద్రుడు, జాయమానః= ప్రతిదినమునుదయించుచు, నవోనవో భవతి=శుక్లపక్షమున దినమునకొక కళచొప్పున వృద్ధినొందుటచేతను, కృష్ణపక్షమున [illegible] చేతను క్రొత్తవాడగుచున్నాడు, చంద్రునివలె సూర్యుడును దక్షిణోత్తరాయణములచే నూతనుడగుచున్నాడు, అట్టిసూర్యుడు, అహ్నాంకేతుః=పగటికాలములకు చిహ్నము (సూర్యోదయమైనచో పగటికాలముగా వ్యవహరింపబడును గాన పగటికి సూర్యుడు గుర్తు) మరియు, ఉషసాం=ఉషఃకాలములయొక్క, అగ్రే=ప్రారంభసమయంబున, ఏతి=తూర్పున నుదయమునొందుచున్నాడు. దేవేభ్యః-దేవతలకొఱకు, భాగం=పగటికాలమున జేయదగిన హోమసంబంధమైన హవిర్భాగములను, విదధాతి=చేయుచున్నా

8 ధాతా రాతి స్సవి తేదం జుషన్తాం ప్రజాపతిర్నిధిపతిర్నో అగ్నిః ।
త్వష్టా విష్ణుః ప్రజయా సగ్ంరరాణో యజమానాయ ద్రవిణం దధాతు ॥

టీ॥ రాతిః=వరములిచ్చు స్వభావముగల, ధాతా=ధాతయను దేవుడున్ను, నిధిపతిః= పద్మము, శంఖము, మొదలగు నవ నిధులకు ప్రభువైన, ప్రజాపతిః=బ్రహ్మదేవుడును, (ఇచ్చట ధాతృప్రజాపతి శబ్దములు బ్రహ్మభేదపరములు) సవితా=సూర్యుడున్ను, అగ్నిః= అగ్నిహోత్రుడున్ను, త్వష్టా=త్వష్టృదేవుడున్ను, విష్ణుః= శ్రీమహావిష్ణువున్ను ఇయ్యునవి (యీయార్వురు దేవతలున్న దేవగణము) ప్రజయా=యజమానుని సంతానముతో, సంరరాణః= చెన్నగా క్రీడించుచు (జాత్యేకవచనం) యజమానాయ= యజమానునికొఱకు, ద్రవిణం= ధనమును, దధాతు=పోషించుగాక.

సంహిత 1 కాండము 1 ప్రపాఠకము 10 అనువాకము.

9 ఆశాసానా సౌమనసం ప్రజాగ్ం సౌభాగ్యం తనూం । అగ్నే రనువ్రతా భూత్వా సంనహ్యే సుకృతాయ కమ్ ॥

## సంహిత 3 కాండము 3 ప్రపాఠకము 1. అనువాకము.

13 అగ్నే తేజస్విన్ తేజస్వీ త్వం దేవేషు భూయాస్తేజస్వంతం మామాయుష్మంతం వర్చస్వంతం మనుష్యేషు కురు దీక్షాయై చ త్వా తపసశ్చ తేజసే జుహోమి తేజోవిదసి తేజో మామాహాసీన్మాహం తేజో హాసిషం మా మాం తేజో హాసీత్ ॥

టీ॥ తేజస్విన్ = తేజస్సుగల, అగ్నే = ఓ అగ్నిహోత్రుడా; త్వం = నీవు, దేవేషు = దేవతలయందున (దేవతలందరిలో) తేజస్వీ = తేజస్సుగలవాడవు భూయాః = కమ్ము, మనుష్యేషు = మనుష్యులయందు (మనుష్యులందరిలో) మాం = నన్ను, ఆయుష్మంతం = ఆయుర్దాయముకలవానినిగాను, తేజస్వంతం = కాంతిగలవానినిగాను, వర్చస్వంతం = బలముకలవానినిగాను, కురు = చేయుము, దీక్షాయైచ = దీక్షయొక్కయు, (షష్ఠ్యర్థే చతుర్థీ) తపసశ్చ = తపస్సుయొక్కయు, తేజసే = తేజస్సుకొఱకు, త్వా = నిన్నుగూర్చి, జుహోమి = హోమము చేయుచున్నాను (అగ్నిహోత్రుడా; నీవు) తేజోవిదసి = తేజస్సునెఱింగినవాడవైతివి.

నే॥ = నేనున్ను, మాం-నన్ను మా హాసీత్ = నీయనుగ్రహముకలన, విడచిపెట్టక బోవుగాక, మాహం తేజో హాసిషం = నేనును తేజస్సును విడువను, మా-నన్నును, తేజః = తేజస్సుమా హాసీత్ = ఎట్లయిన విడువకపోవుగాక.

॥ ఇంద్రౌజస్విన్నోజస్వీత్వం దేవేషుభూయా ఓజస్వంతం మామాయుష్మంతం వర్చస్వంతం మనుష్యేషుకురు బ్రహ్మణశ్చత్వా క్షత్రస్యచౌజసే జుహోమ్యోజో విదస్యోజో మామాంహాసీన్మాహమో జో హాసిషం మామామోజో హాసీత్ ॥

టీ॥ ఓజస్విన్ - బలముగల, ఇంద్ర - ఓయింద్రుడా! త్వం - నీవు, దేవేషు - దేవతల యందు, ఓజస్వీ - బలశాలివి, భూయాః - కమ్ము, మనుష్యేషు - మనుష్యులయందు, మాం - నన్నును, ఓజస్వంతం - బలశాలినిగాను, ఆయుష్మంతం - ఆయుర్దాయము కలవానినిగాను వర్చస్వంతం - వర్చస్సుగలవానినిగాను, కురు - చేయుము, బ్రహ్మణశ్చ - బ్రాహ్మణజాతియొక్కయు, క్షత్రస్యచ - క్షత్రియజాతియొక్కయు, ఓజసే - బలముకొరకు, త్వా - నిన్ను గూర్చి, జుహోమి - హోమముచేయుచున్నాను ఓయింద్రా! నీవు ఓజోవిదసి = బలము

కొరింగిన వాడవైతివి, ఓజః=బలము, మా = నన్ను, మాహాసీత్ = విడువక పోవుగాక, అహం= నేను, ఓజః=బలమును, మహాసిషం=విడువను, ఓజః=బలము, మాం=నన్ను, మాహాసీత్ =ఎట్లయిన విడువక పోవుగాక.

„ సూర్యభ్రాజస్విన్ భ్రాజస్వీత్వం దేవేషు భూయా భ్రాజస్వంతం మామాయుష్మంతం వర్చస్వంతం మనుష్యేషుకురు వాయో శ్చత్వా పాంచభ్రాజసేజుహోమి సువర్విదసిసువర్మా మాహాసీస్మామాగ్ం సువహాఽసిషం మామాగ్ం సువహాఽసీత్ ।

టీ॥ భ్రాజస్విన్ = దీప్తి (వెల్తురు)గల, సూర్య = ఓసూర్యుడా! త్వం = నీవు దేవేషు = దేవతలయందు, భ్రాజస్వీ = దీప్తిగలవాడవు, భూయాః = కమ్ము, మనుష్యేషు = మనుష్యులయందు, మాం = నన్ను, భ్రాజస్వన్తం = దీప్తిగలవానినిగాను, ఆయుష్మంతం = ఆయుర్దాయముగలవానినిగాను, వర్చస్వంతం = బలముగలవానినిగాను, కురు = చేయుము, వాయోశ్చ = వాయుదేవునియొక్కయు, అపాంచ = నీటియొ

శ్రేయము,భ్రాజసే = దీప్తికొఱకు. త్వా= నిన్నుగూర్చి. జుహోమి = హోమముచేయుచున్నాను) (ఓసూర్యుఁడా; నీవు) సువర్విత్=స్వర్గమును, తెలిసికొనినవాడవు,అసి= ఐతివి,సువః=(సువర్) స్వర్గము,మా= నన్నును,మాహాసీత్=విడువకపోవుగాక, అహం= నేను,సువః=స్వర్గమును, మాహాసిషం=విడువను, సువః=స్వర్గము, మాం=నన్నును,మాహాసీత్= ఎట్లయినను విడువకపోవుగాక.

,, మయిమేధాం మయిప్రజాం మయ్యగ్నిస్తేజోదధాతు మయి మేధాం మయిప్రజాం మయీంద్ర ఇంద్రియందధాతు మయిమేధాంమ యిప్రజాం మయిసూర్యో భ్రాజోదధాతు ॥

టీ॥ అగ్నిః=అగ్నిహోత్రుఁడు,మయి=నాయందు,మేధాం=ధారణశక్తిని,.మయి= నాయందు, ప్రజాం=సంతానమును,మయి=నాయందు, తేజః=తేజస్సును, దధాతు=ఉంచుగాక, ఇంద్రః=ఇంద్రుఁడు,మయి=నాయందు, మేధాం= ధారణశక్తిని, మయి=నాయందు ప్రజాం=సంతానమును, మయి=నాయందు,ఇంద్రియం=బలసామర్థ్యవిశేషములను, దధాతు= ఉంచుగాక,సూర్యః=సూర్యుఁడు,మయి=నాయందు, మేధాం=ధారణశక్తిని, మయి=నా

యందు, ప్రజాం=సంతానమును, మయి=నాయందు, భ్రాజః=దీప్తిని, దధాతు=ఉంచుగాక.
(ఈ యనువాకమునందు, దీక్ష తపస్సు తేజస్సుధారణ శక్తి బలము పొందలగునవి
అగ్న్యాదిదేవతలవలన బ్రార్థింపబడుచున్నవి, మీదచెప్పినదీక్షాదులు బ్రహ్మచర్యము
చేయు వటువులకు ముఖ్యముగ నుండవలెనుగాన నీయనువాకముచే నుపనయనాది
యందు విప్రోత్తములాశీర్వదింపుచున్నారనుట.

## వివాహమహదాశీర్వచనమ్.

ఆరణ్యకము 1 ప్రపాఠకము 27 అనువాకము.

14 యోవైతాం బ్రహ్మణోవేద । అమృతేనావృతాంపురీమ్ ।
తస్మై బ్రహ్మచ బ్రహ్మచ। ఆయుః కీర్తిం ప్రజాందదుః॥

టీ. బ్రహ్మణః= సచ్చిదానందాత్మకమగు నద్వితీయపరబ్రహ్మసంబంధమైన, అమృతేన= పరమానందమునే, ఆవృతాం= వ్యాప్తమైనట్టి, తాంపురీం= ఆజీవచైతన్యమునకాధారమగు శరీరమును, యోవై= ఎవడు, వేద= తెలిసికొనుచున్నాడో, తస్మై= వానికొ

అకు, బ్రహ్మచ-పరమాత్మయు బృహస్పతి = బృహస్పతిదేవుఁడును, (మతియు సమస్తదేవతలును, ఆయుః = ఆయుర్దాయమును, కీర్తిం = కీర్తిని, ప్రజాం= సంతానమును, దధుః= ఇచ్చుచున్నారనుట.

బ్రాహ్మణము 1 కాండము 4 ప్రపాఠకము 4 అనువాకము.

15 భాగధేయేనైవైనం ప్రణయతి । బ్రాహ్మణఆర్షేయముద్ధరేత్ । బ్రాహ్మణోవైసర్వాదేవతాః। సర్వాభిరేవైనందేవతాభిరుద్ధరతి ॥

టీః (సాయంకాలమున గార్హపత్యాగ్ని హోత్రమునుండి యాహవనీయాగ్నిని గూర్చి యగ్నిప్రణయనము చేయుటకు పూర్వము సూర్యుఁడస్తమించినేని యాహితాగ్నికి దోషమున్నది, కైవాద్యాలాసంభవించినచో (రాత్రిప్రణయించినపుడు) బంగారమును దర్భచేగట్టికట్టి (దానితో) తూర్పుభాగమునకు ప్రణయనము చేయవలయును, ఇట్లు చేసినచో) ఏనం= ఈయగ్నిని, భాగధేయేనైవ= భాగధేయము చేతనే, ప్రణయతి= తీసినవాడగుచున్నాడు, ఆర్షేయః=తనప్రవరమును తెలిసినట్టి, బ్రాహ్మణః= బ్రాహ్మణుఁడు, ఉద్ధరేత్ = మీదచెప్పినయగ్ని ప్రణయనమువిధిగా చేయవలయు, బాహ్మణః=బాహ్మ

ణుఁడు,సర్వాదేవతాః=సమస్తదేవతా స్వరూపుఁడుఁగదా! ఏనం=ఈయగ్నిని,సర్వాభిః=సమస్తమైన, దేవతాభిః=దేవతలచేతను, ఉద్ధరతి=ఉద్ధరించుచున్నారనుట, అనఁగా పరిపాలనము చేయుచున్నారని తాత్పర్యము,

## ఆరణ్యకము 2 ప్రపాఠకము 15 అనువాకము.

16 యావతీర్వై దేవతా స్తా స్సర్వా వేదవిది బ్రాహ్మణే వస
న్తి తస్మాద్బ్రాహ్మణేభ్యో వేదవిద్భ్యో దివే దివే నమస్కుర్యాన్నాశ్లీలం కీ
ర్తయే దేతా ఏవ దేవతాః ప్రీణాతి ॥

టీ॥ యావతీర్వై దేవతాః= అగ్ని మొదలు విష్ణుపర్యంతము దేవతలెందఱుకలరో, తాస్సర్వాః = వారలందఱును, వేదవిది = వేదము దెలిసినట్టి, బ్రాహ్మణే = బ్రాహ్మణునియందు, వసంతి = ఉంటున్నారు, తస్మాత్ = అందువలన, వేదవిద్భ్యః = వేదము తెలిసిన, బ్రాహ్మణేభ్యః = బ్రాహ్మణులకొఱకు, దివేదివే = ప్రతిదినము, నమస్కుర్యాత్ = నమస్కరింపవలెను, అశ్లీలం = అట్టిమహానుభావులసంబంధ

మగుదుగుణమును, నకీర్తయేత్ = పలుకకుండవు, వాకికీర్తిసగా ప్రకటము చేసినవాడు, ఏతా
ఏవదేవతాః = వారియందుండు, దేవతలను. ప్రీణాతి = సంతోషపెట్టుచున్నాడనుట.

సంహిత 5 కాండము 4 ప్రపాఠకము 12 అనువాకము.

17 పర్యాప్త్యా అనంతరాయాయ సర్వస్తోమోఽతిరాత్ర ఉత్తమమ
హర్భవతి సర్వస్యాప్త్యై సర్వస్య జిత్యై సర్వమేవ తేనాఽప్నోతి సర్వం
జయతి ॥

టీః ( అశ్వమేధయాగమున గానముచేయఁబడునట్టి యజ్ఞావాక సామము) పర్యా
ప్త్యై = సంపూర్తికొఱకున్ను, అనంతరాయాయ = నిర్విఘ్నముకొఱకున్ను అగుచున్నది
సర్వస్తోమః = త్రివృత్తు, పంచదశము మొదలగు స్తోమములుగల, అతిరాత్రః = అతిరాత్ర
మనెడి క్రతువు, ఉత్తమమహర్భవతి = తుదిరోజున చేయఁదగినదగుచున్నది ఈసర్వస్తో
మము, సర్వస్యాప్త్యై = పొందుటకుపీలుగాని, సకలకామ్యప్రాప్తికొఱకును, సర్వస్యజిత్యై =
సకలశత్రువిజయముకొఱకును అగుచున్నది, తేన = ఆసర్వస్తోమముచేత, సర్వంసమస్తము

గుణాభ్యుదయము, ఆహోస్వి త్తీ = యజమానుడు పొందుచున్నాడు, సర్వంజయతి జయింపదగిన శత్రుమండలిని, జయింపుచున్నారనుట.

. సంహిత 5 కాండము 7 ప్రపాఠకము 4 అనువాకము.

1ర అగ్నే యశస్విన్ యశసేమమర్పయేంద్రావతీ మపచితీమిహావహ । అయంమూర్ధాపరమేష్ఠీ సువర్చాస్సమానానా ముత్తమశ్లోకోఽస్తు ॥

టీ। యశస్విన్ = అధికముగు కీర్తిగలిగినటువంటి, అగ్నే! ఓయగ్నిహోత్రుడా! ఇమం = ఈయజమానుని, యశసా = కీర్తితో, అర్పయ = కలుపుము, ఇంద్రావతీం = ఇంద్రసౌభాగ్యముగు, అపచితీం = పూజను, ఇహ = ఇపుడు, ఆవహ = సంపాదింపుము, అయం = ఈయజమానుడు, సమానానాం = సభవారిలో మూర్ధా = నీయనుగ్రహామువలనశిర స్థానీయుడు, పరమేష్ఠీ = ఉత్తమమగు స్థానమునందుండువాడును, సువర్చాః = మంచి కాంతిగలవాడును, ఉత్తమశ్లోకః = మంచికీర్తిగలవాడును, అస్తు = అగుగాక.

సంహిత 3 కాండము 2 ప్రపాఠకము 8 అనువాకము.

19 అస్మేదేవాసో వపుషేచికిత్సతయమాశిరా దంపతీవామమశ్నుతః॥ పుమాన్పుత్రో జాయతేవిందదేవస్వాధవిశ్వేఅరపావధ తేగృహాః॥

టీ॥ దేవాసః = ఓదేవతలారా! అస్మే = మాయొక్క, వపుషే = శరీరముకొఱకు, చికిత్సత = రోగముగాని పాపముగాని లేకుండునట్లుచేయుడని భావము, ఆశిరా = పెరుగుచేతను, యం = ఎట్టి (రూపవిశేషమును) వామం = మనోహరమగు (రూపవిశేషము ను,దంపతీ = ఈయజమాన దంపతులు, అశ్నుతః = పొందుచున్నారో, (అట్లుమాశరీముకొఱకు చికిత్సచేయుడని పూర్వమునకన్వయము) (ఈమంత్రములు పఠింపుచుయజ్ఞము క, ఉపభృత్తు = అనుపాత్రనందునతావలిత్రిమునుంచి, దానియందుయజమానదంపతులుపెరుగును విడచిపెట్టుదురు) మఱియు నీదంపతులకు, పుమాన్ పురుషలక్షణములచేపరిపూర్ణుండగు,పుత్త్రః = కుమారుడు, జాయతే = పుట్టుగాక, అట్లుజన్మింపఁబడు పుత్త్రుడు,అథ = పిదప, వసు = ధనమును, విందతే = పొందుగాక, మఱియు, గృహాః = ఇంటనున్న, విశ్వే = అందఱును, అరపాణి = పాపములేనివారై, ఏధతే = వృద్ధినొందుగాక.

20 ఆశీర్దాయా దంపతీవామమశ్నుతాం మరిష్టో రాయస్సచతాం
గ్ం సమోకసా। యఆసిచత్సందుగ్ధం కుంభ్యాసహేష్టేనయా మన్నము
తింజహాతుసః ॥

టీ॥ ఆశీర్దాయా= లోఁగడచెప్పిన, పెరుగ ్చుచున్నట్టియు, సమోకసా= ఒక్క
గృహముననివసించునట్టియు. దంపతీ=దంపతులు ామం=కల్యాణమును అశ్నుతాం=
పొందుదురుగాక, అరిష్టః=సుఖముగల, యజమా: ) రాయః=ధనములను, సచతాం=
పొఁదుగాక, యః=ఏయజమానుఁడు, ఇష్టైనసహ తియును కూర్చుండి, యూషన్=సాఁభూ
తమైన, సోమునకుసహముఁదు, సందుగ్ధం=ప్రస్తుతవ వధిభాగమునొందియున్న [illegible]గమును,
కుంభ్యా=కడవతో, ఆసించత్=పోయుచుచా ి, (అట్టియజమానుఁడు)సః=వాఁడు
అమతిం=దుర్బుద్ధిని- జహాతి=విడుచుచున్నాడు:

21 సర్పిర్గ్రీవీపీవత్యస్య జాయా ాసః పుత్రాః అకృశాసో అస్య।
సహజానిర్యస్సుముఖస్యమాన ఇంద్రా శిరగ్ం సహాకుంభ్యాదాత్ ॥

టీ॥ సహాసాని=శౌర్యతో గూడి యుండినట్టియు, సుశుష్మాణః=మంచిశుష్కమును చేయగోరుచున్న, యః=ఏయజమానుఁడు, ఇంద్రాయ=ఇంద్రునికొఱకు, శుంభాత్రే= కవనమ్ములను, అదాత్=ఇచ్చినాఁడో, అస్య=అట్టియాయజమానునియొక్క, జాయా=భార్య, సర్పిర్గ్రీవీ=మృదువైన కంఠముగలదియు, పీవరీ=బలసియున్నదియు, (అగుగాక.) అస్య=ఈయజమానునియొక్క, పుత్రాః=కుమారులు, పీవానః=బలసినవారును, అకృశాసః=వ్యాధిమొదలగు కారణములచే నెన్నఁడును కృశింపనివారును (అగుగాక.)

22 ఆశీర్న ఊర్జ ముతసుప్రజాస్త్వమిషం దధాతు ద్రవిణగ్ం సవర్చసం సంజయన్‌క్షేత్రాణి సహసాహమింద్ర కృణ్వానో అన్యాగ్ం అధరాన్ సపత్నాన్ ॥

టీ॥ హేఇంద్ర=ఓయింద్రుఁడా! ఊర్జం=దక్షిణరాగి దేవోపభోగ్యమగు నన్నమును, ఉత=మఱియు, సుప్రజాస్త్వం=మంచిసంతానము కల్గియుండుటయును. ఇషం=మనుష్యోపభోగ్యమగు నన్నమును, సవర్చసం=బలసహితమైన, ద్రవిణం=ధనమును, దగా

గుః=నీవు సాక్షికమ్మృగాక, మఱియు నీప్రసాదమువలన, క్షేత్రాణి= శత్రుక్షేత్రములను సంజయన్=జయింపుచు,అన్యాన్సపత్నాన్= మఱికొందరు శత్రువులను, అహం= నేను,సహసా=బలము చే,అధరాన్=నాయాజ్ఞకు లోబడినవారినిగా) కృణ్వానః=చేయుచున్నవాడనుకాగలను, మే=నాయొక్క, ఆశీః=(ఇది) (ఇదినాప్రార్థనమని తాత్పర్యము)

సంహిత 5 కాండము 5 ప్రపాఠకము 9 అనువాకము.

23 వసవస్త్వారుద్రైః పురస్తాత్పాంతు పితరస్త్వాయమరాజానః పితృభిర్దక్షిణతః పాంత్వాదిత్యాస్త్వా విశ్వైర్దేవైః పశ్చాత్పాంతుద్యుతానస్త్వామారుతో మరుద్భిరుత్తరతః పాతుదేవాస్త్వేంద్ర జ్యేష్ఠావరుణ రాజానో ధస్తాచ్చోపరిష్టాచ్చపాంతు ॥

టీ॥ రుద్రైః=ఏకాదశరుద్రులతోగూడ, వసవః=అష్టవసువులున్ను, త్వా=నిన్ను, పురస్తాత్=తూర్పుభాగమున, పాంతు=రక్షించుదురుగాక, యమరాజానః = యముడు రాజుగాగల, పితరః=పితృదేవతలు, పితృభిః=ఇతరమైన పితృగణముతోగూడ, త్వా=నిన్ను,

దక్షిణతః=దక్షిణదిక్కునయందు, పాంతు=రక్షించుగాక, విశ్వైర్దేవైః = విశ్వేదేవులతో గూడ, ఆదిత్యాః=ద్వాదశాదిత్యులు, త్వా=నిన్ను, పశ్చాత్ = పశ్చిమదిక్కునయందు, పాంతు=రక్షించుగాక, ద్యుతానః=మిక్కిలిప్రకాశించుచున్నట్టి, ద్యుతానుఁడను. మారుతః=మరుత్పతి, మరుద్భిః=ఇతరమరుద్గణములతోఁగూడ, త్వా=నిన్ను ఉత్తరతః = ఉత్తరదిక్కునయందు, పాతు=రక్షించుగాక, ఇంద్రజ్యేష్ఠాః= ఇంద్రుఁడు మొదలగువారును, వరుణరాజానః=వరుణుఁడు రాజుగాగలవారును, అగునీయుభయవిధములగు, దేవాః= దేవతలు, త్వా=నిన్ను, అధస్తాత్=అధోభాగమునను, ఉపరిష్టాచ్చ= మీఁదిభాగమునను, పాంతు= రక్షింపుదురుగాక.

## సంహిత 6 కాండము 1 ప్రపాఠకము 10 అనువాకము.

24 అక్రీతోస్య సోమస్యాన్నా సైన్యతేముష్మిన్ లోకేసోమగ్ం రక్షియుర్యదే తేభ్యస్యో మక్రయణానను దిశతిక్రీతోస్య సోమోభవ త్యే తేస్యాముష్మిన్ లోకేసోమగ్ం రక్షన్తి.

టీ॥ (స్వానుడు, భ్రాజుండు, అంఘారి, బంభారి, హస్తుడు, సుహస్తుడు, కృశానువు. ఈగంధర్వులు, సోమరక్షకులు, వీరికి, గోవు, బంగారము, ఎద్దు, వస్త్రము మొదలగువానిని సోమక్రయణము కొఱకిచ్చెదరలయును. అట్లుగానిచో) అస్య= ఈయజమానునియొక్క, సోమః సోమరసము, అక్రీతః ఏవస్యాత్ = కొనబడనిదియగును, అస్య సోమం = వీనిసోమరసమును, ఏతే = ఈస్వానాదిగంధర్వులు, అముష్మిన్ లోకే= స్వర్గలోకమున, పరక్షేయుః= సంరక్షింపరు, ఏతేభ్యః = ఈగంధర్వులకొఱకు, సోమక్రయణాన్ = గోవుమొదలగువాటిని, యదనుదిశతి = ఇచ్చినయెడల, అస్యసోమః= వీనిసోమము, క్రీతః= కొనఁబడినది, భవతి = అగుచున్నది, ఏతే= ఈగంధర్వులు? అస్యసోమం= వీనిరసమును, అముష్మిన్ లోకే= స్వర్గలోకమున, రక్షన్తి= రక్షించుచున్నారు,

సంహిత 3 కాండము 2 ప్రపాఠకము 10 అనువాకము.

25 గాసఇంద్రవాయూ మిత్రావరుణా వశ్వినావభిదాసతిభ్రా

తృవ్యఉత్సిపీతేశుభస్పతీ। ఇదమహంతమధరం పాతయామి యథేంద్రా
హాముత్తమశ్చేతయాని ॥

టీ। శుభస్పతీ = శుభకర్మను పాలించుచునటువంటి, హేఇంద్రవాయూ — ఇం
ద్రవాయువులారా! మిత్రావరుణా = మిత్రవరుణదేవులారా! అశ్వినా = ఓయశ్వినీదేవ
తలారా! మాభ్రాతృవ్య। = ఏశత్రువు, నః = మమ్ములను, అభిదాసతి = హింసింపుచు
న్నాడో, మఱియు ఉత్సిపీతే= మమ్ములనతిక్రమించి సోమపానముఁ జేయుచున్నాడో,
తం = ఆశత్రువును, అహం = నేను, ఇదమధరంపాతయామి= ఇదుగో క్రిందుగాబడదోసి,
యుచున్నాను, హేఇంద్ర = ఓయింద్రుడా! యథా = ఎట్లు = అహం= నేను, ఉత్త
మః = శ్రేష్ఠుఁడనై, చేతయాని= ఇహపరలోకజ్ఞానము కలవాడను కాగలనో యట్లనుగ్ర
హింపుమనుట.

సంహిత 5 కాండము 6 ప్రపాఠకము 5 అనువాకము.

26 తస్మై తే సహస్రగ్ం సహస్రం పుత్రానవిందంత ప్రథతే

భవంత్విన్ద్రాగ్నిభ్యా మవబాధామహేతాన్ । వసవోరుద్రాఆదిత్యా ఉపరిస్పృశం మోగ్రంచేత్తార మధిరాజమక్రన్ । అర్వాంచమిన్ద్రమ ముతోహవామహే యో గోజిద్ధనజిదశ్వజిద్యః। ఇమంనోయజ్ఞం విహవే జుషస్వాస్యకుర్మో హరివో మేదినంత్వా ॥

టీ॥ హేఇంద్ర = ఓయింద్రుఁడా! నః= మమ్ములను, మారీరిషః = హింసింపకుమా, మాపరాదాః = తిరస్కరింపకుమా, నః = మాకు, యే = ఎవరు, సపత్నాః = శత్రువులో, తే = వారు, అపభవంతు = పరాయలగుదురుగాక, మత్తేను, తాన్ = ఆశత్రువులను, ఇంద్రాగ్నిభ్యాం = అనుగ్రహించిన యింద్రాగ్నులతోఁ గలసి. అవబాధామహే = బాధింపుచున్నాము, వసవోరుద్రాఆదిత్యాః = వసురుద్రాదిత్యదేవతలు, మా = నన్ను, ఉపరిస్పృశం — స్వర్గమునుస్పృశించునట్టివాఁడనుగాను, ఉగ్రం = శత్రుతిరస్కారమునకు సమర్థునిగాను, చేత్తారం = జ్ఞానముగలవానిగాను, అధిరాజం = అందరికిఁ బ్రభువునుగాను, అక్రన్ = చేయుదురుగాక. యః = ఏయింద్రుఁడు, గోజిత్ = పశులయొక్క, గోవులనుజయించు=

నట్టివాఁడో, యః = ఏయింద్రుఁడు, ధనజిత్ - పరధనములను జయించునట్టివాఁడో, యః ఏయింద్రుఁడో, అశ్వజిత్ =పరులయొక్క గుఱ్ఱములను, జయించునట్టివాఁడో, అట్టి దేవేంద్రుని, అర్వాంచం-మాకెదురుగ, అముతః-ఈయజ్ఞ కారణము (మిమ)వలన,హేహామ హే- పిలుచుచున్నాము, హేహారిః- హారియను పేరుగల గుఱ్ఱములుగల్గిన యోయింద్రుఁడా! విహవే-ఆసేకులు, నినుబిలుచుచున్నను,నః-మాయొక్క, ఇమంయజ్ఞం - ఈయజ్ఞమును-జుషస్వ-సేవింపుము, మఱియు, త్వా-నిన్ను, అస్య- ఈయజమానునియొక్క, మేదినం, స్నేహముకలవానిగా, కుర్మః-చేయుచున్నామనుట.

సంహిత 4 కాండము 2 ప్రపాఠకము 3 అనువాకమ్.

28 పునస్త్వాదిత్యారుద్రావసవస్సమింధతాం పునర్బ్రహ్మాణోవ

సునీధయజ్ఞైః । ఘృతేనత్వంతనువోవర్ధయస్వ సత్యాస్సంతుయజమాన

స్యకామా

టీ॥ ద్రావిణోదాః = ధనప్రాప్తికి కారణుడవగు, అగ్నే = అగ్నిదేవుడా, త్వా = నిన్ను, ఆదిత్యాః-ద్వాదశాదిత్యులును, రుద్రాః-ఏకాదశరుద్రులును, వసవః-అష్టవసువులును, బ్రాహ్మణాః-ఋత్విజులును యజ్ఞైః-సాధనభూతములగు యజ్ఞములచేత, వృధః-వృద్ధినొందింతురుగాక యనియర్థము. త్వం-నీవు, ఘృతేన-ఆజ్యముచే తృప్తిఁజెందినవాడవై, తనువః- మాశరీరములను, తిపగా, సమింధతాం=అనఁగా నుపశాంతినొందిన నిన్ను వృద్ధినొందింతురుగాక యనియర్థము. యజమానస్య- యజమానునియొక్క యస్య-వృద్ధినొందింపుము, నీవు సంతుష్టినొందినచో, యజమానస్య- యజమానునియొక్క, కామాః-కోరికలు, సత్యాః-సత్యములైనవి,సంతు-అగుగాక, నీయనుగ్రహమువలన యజమానుని కోర్కెలు సిద్ధింపుగాకయని ముఖ్యాభిప్రాయము.

## సంహిత 2 కాండము 6 ప్రపాఠకము. 1అనువాకమ్.

(పితా వై ప్రయాజాః ప్రజానూయాజా యత్ప్రయాజా నిష్ట్వా హవీగం వ్యభిఘారయతి పితైవ తత్పుత్రేణ సాధారణమ్.

29 కురుతే స్మాదాహుర్యశ్చైవం వేదయశ్చనకథా పుత్రస్య

కేవలంకథా సాధారణం పితురిత్యస్కన్న మేవ తద్యత్ప్రియాజేష్విష్టేషు స్కందతి గాయత్ర్యైవ తేనగర్భం ధత్తేసాప్రజాం పశూన్ యజమానాయప్రజనయతి ॥

టీక॥ ఆశీర్వచన సమయములయందు చాలాపండితులు దీనిని "కురుతే తస్మా" త్తని ప్రారంభింపుచుందురు. అందువలన వాక్యసమన్వయము కానందున "పితా వైప్రియాజాః" అనుపూర్వవాక్యము నుదహరించి టీకవ్రాయఁబడెను.

టీ॥ పితా వైప్రయాజాః = యాగములందు పూర్వము చేయఁబడుచున్న ప్రయాజహోమములు, పితృస్థానీయములు (తండ్రివంటివి) ప్రజానూయాజాః = తుదను హోమము చేయఁబడుచున్న అనూయాజలు, పుత్రస్థానీయములు (పుత్రసమానములు,) యత్ప్రియాజాన్యిష్ట్వాపాశీన్ వ్యభిఘారయతి= ఎందువలన ప్రయాజహోమముఁజేసి అనూయాజహోమార్థము "ఉపభృత్" అనుపాత్రమునందు సంగ్రహించినపురోడాశము మొదలగుహవిస్సులనుగూడ ప్రయాజశేషమగు నాజ్యముచే నభిఘారణముచేయుచున్నాడో అందువలన పితైవతత్పుత్రేణ సాధారణం కురుతే = పితృస్థానీయములగు ప్రయాజలయొక్క మిగిలిన

యాజ్యము, పుత్రస్థానీయములగు అనూయాజలకుఁగూడ నుపయోగింపఁబడు చున్నదని భావము, తస్మాత్ = అందువలన యన్త్వైవం వేద=ఎవ్వఁడు వేదముఁ జగిని ప్రయాజానూయాజల వృత్తాంతమునిట్లు దెలిసికొనునో, యశ్చన= ఎవఁడట్లుగాక దెలిసికొనకయుండునో, ఈరెండువిధంబులగు, జనులయొక్క సభలోనుపవిష్టులయిన యనభిజ్ఞులు, కథా-ఏ కారణము చేత, పుత్రస్య - కుమారుని యొక్క, ధనము కేవలం - ఒక్కయా కుమారునకే హక్కు కలదియైనది? పితుః-తండ్రియొక్క ధనము, కథా-ఏ కారణముచేత, సాధారణం-ఆతండ్రికిని కుమారులకును హక్కుకలదియైనది? ఇతి-ఇట్లు ఆహుః-పలుకుచున్నారు(ప్రశ్నించుచున్నారు.) ఇచ్చటప్రాజ్ఞులు ప్రయాజానూయాజ దృష్టాన్తమును చెప్పవలయును. పితృపుత్రస్థానీయములగు ప్రయాజానూయాజలలో పితృస్థానీయములగు ప్రయాజల శేషాజ్యముచే ననూజహావిస్సుల నభిఘారించుటచేతను పితృధనము సాధారణమనియు అనూయాజ శేషాజ్యముచే ప్రయాజహావిస్సులకు అభిఘారణమనపేక్షితముగాన పుత్రద్రవ్యము పుత్రునిదే యగుననియు నీప్రకారము మీదిప్రశ్నమున కుత్తరముచెప్పఁదగినదని తాత్పర్యము. (ప్రయాశేషు=ప్రయాజవిధులు ఇష్టేషు - జరుపబడినపిదప, యత్ ప్యందతి- శేషహావిస్సులయందే, యభిఘారణము చేయకాజ్యము విడువఁబడునో, యది

అస్మిన్ను మేధ-వాశవము లేనిదియే, యగును. తేన- ఆ కారణముచేతను, గాయత్ర్యా- గాయత్రిచే. గర్భం-గర్భమును, ధత్తే- ధరించుచున్నది అనఁగా నష్టాక్షర గాయత్రిలో పంచాక్షర రూపమగు ప్రయాజవిధియు - నతిగతి రూపమగు నమాయాజ విధియు నను రెండువిశేషములుగలవు. అందుమధ్యభాగముననే యభిఘారము విధింపఁబడినదో. యాయభిఘారమునే గాయత్రి తనయుదరమున గర్భరూపముగ ధరించుచున్నది. అని యభిప్రాయము సా-ఆగాయత్రి యజమానాయ-యజమానునికొఱకు, ప్రజాం-సంతానమును. పశూన్-పశువులను, ప్రజనయతి-పుట్టించుచున్నది.

సంహిత 6 కాండము 5 ప్రపాఠకము 8 అనువాకము.

30 నేష్టః పత్నీముదానయేత్యా హాగ్నీదేవనేష్టరి రేతో దధా
తినేష్టాపత్నీ యాముద్గాత్రా సంఖ్యాపయతిప్రజాపతిర్వా ఏషయదు
ద్గాతాప్రజానాం ప్రజననాయాప ఉపప్రవర్తయతి రేత ఏవతత్సించ
త్యూరుణోపప్రవర్తయ త్యూరుణాహి రేతస్సిచ్యతే నగ్నంకృత్యో [illegible]

ముషః ప్రవర్తయతి యదాపీనగ్నదో రుర్భవత్యగ్నిమిధునీ భవతో᳚గ
కేతస్సిచ్యతే ధ్రువజాః ప్రజాయన్తే ॥

టీ॥ (అగ్నిధ్రుడు నేష్ట ఉద్గాత అనునీనామంబులు ఋత్విజులలో గొందరు కుండును వీరిపైని వాక్యము లిందు చెప్పబడినవి. పైని చెప్పవలెగా వస్యస్యుండితిర ఋత్విజులకు కొప్పుభాది కార్య విభాగమనబడును.)

(మఱియు నోయాగ్నీధ్రుడా! నేష్టయొద్దగూరుచుండు మనియు) నేష్టః- నేష్టయు నను, ఋత్విజుడా? నీవు,పత్నీం-యజమానుని భార్యను, ఉదానయ - లేవనెత్తితీసికొని రమ్ము. ఇత్యాహ - అనిపలుకుచున్నాడు. ఇందువలన అగ్నిత్-అగ్నీధ్రుడు, నేష్టర్యేవ-నేష్టయుండే, రేతః-రేతస్సును. దధాతి- ఉంచుచున్నాడు. నేష్టా - నేష్టయను వాడు, పత్న్యాం-భార్యయందు రేతస్సునుంచుచున్నాడు.

(రేతస్సిద్ధమిచట ప్రజోత్పత్తి సాధనము సామర్థ్యమును చెప్పను) ఉద్గాత్రేసంఖ్యాపతి = పిసపనేష్టయొక్క వాక్యప్రికా ముద్గాత భార్యను చూముచున్నాడు,ప్రజానాం = ప్రజలయొక్క, ప్రజననాయ = పుట్టుటకొఱకు, ఉద్గాతే = ఉద్గాతకుప్ర

జాపతిర్వా ఏషః = బ్రహ్మసమానుఁడు (అనిభావము) అపః = పన్నెజనీజలమును ఉపరి తిష్ఠతి = భార్యతనపృష్ఠప్రదేశమునందుంచుచున్నది, రేతఏవతిష్ఠతి — (అట్లుచేయుట) రేతస్సేకమువంటి దగునని తాత్పర్యము, ఊరుణోపప్రవర్తయతి = మీదజెప్పిన పన్నెజనీజలమును భార్య తనయొక్క ప్రదేశ (తొడలు) మునందుంచుచున్నది, ఊరుణా = ఊరుప్రదేశసామర్థ్యముతోడనే, రేతః = రేతస్సు, సిచ్యతేహి = లోకమున విడువఁబడుచున్నదనిభావము, ఊరుం = ఊరుప్రదేశమును, నగ్నంకృత్వా = వస్త్రవిహీనముగాచేసి ప్రవర్తయత్యప = భార్యప్రవర్తింపుచున్నది (ఉంటున్నదని తాత్పర్యము) యదాహి = ఎప్పుడైతే, ఊరుః = ఊరుప్రదేశము, నగ్నః = వస్త్రముచేనిది) భవతి = అగుచున్నదో, అథ = అటుపిమ్మట, మిథునీభవతః = సంయోగము నొందుచున్నారు, అథ = పిదప, రేతః = రేతస్సు, సిచ్యతే = విడువఁబడుచున్నదనిభావము, అథ = అటుపైని, ప్రజాః = ప్రజలు, (బిడ్డలు) ప్రజాయంతే = పుట్టుచున్నారు.

(ఈశ్రుతిచే గర్భాధాన సమయమున నాశీర్వదింపుచున్నారనుట)

ఈఆంధ్రదేశమందుండు వేదశాస్త్రప్రవీణతగల మహానుభావులందఱు వారివారి సామర్థ్యమునననుసరించి ప్రకృతకాలోచితములను జాదిసే ముందుగా ఆశీర్వచనమంత్ర

భాగమునందుగల ముఖ్యమగు మంత్రములనుచ్చరింపుచు పిమ్మట క్రమం, ఘన, జటా, మొదలగు వానితో శ్రేయస్కరమైన వాక్యములను చేర్చి ఆశీర్వచనము ప్రార్థించేయుచున్నారని తాత్పర్యము.

అథ బ్రాహ్మణమ్.

బ్రాహ్మణము 3 కాండము 8 ప్రపాఠకము 1 అనువాకము.

31 సాంగ్రహణ్యేష్ట్యాయజతే । ఇమాంజనతాగ్ం సంగృహ్ణానీతి । ద్వాదశారత్నీ రశనాభవతి । ద్వాదశమాసాస్సంవత్సరః। సంవత్సరమేవావరుంధే। మౌంజీభవతి ఊర్గ్వైముంజాః। ఊర్జమేవావరుంధే। చిత్రానక్షత్రంభవతి। చిత్రంవావతత్కర్మ। యాదశ్వమేధస్సమృద్ధ్యై ॥

టీక॥ ఇమాం=ఈలోకమునం గనబడుచున్న, జనతాం=జనసమూహమును, సంగృహ్ణానీతి=సంగ్రహించి, స్వాధీనముచేసికొందునని యభిప్రాయముగలవాడు, సాంగ్రహణ్యేష్ట్యా=

సాంగ్రహణేష్టిచే, యజతే=యాగముచేయుకలవాఁడు, తానుకోరినసమస్త కార్యములు దేనిచే సిద్ధింపునో యదిసాంగ్రహణేష్టియని చెప్పఁబడును, రశనా=గుఱ్ఱమును గట్టుట కుపయుక్త మగు త్రాడు, ద్వాదశారత్నిః= ఇరువదినాలుగంగుళములుగల పరిమాణము నరత్నియను సంజ్ఞ, (మూర, అనవచ్చును) (అట్టితాడు) పన్నెండు మూరలు పొడవుగలది, భవతి=

అగుచున్నది, సంవత్సరః=సంవత్సరము, ద్వాదశమాసాః=పన్నెండుమాసములు, అనఁగా పన్నెండుమాసములు లోకసంవత్సరమని భావము) అట్టిసంఖ్యాసామాన్యముచే, సంవత్సర మేవ=సంవత్సరమునే అవరుంధే=పొందుచున్నాడు, మౌంజీభవతి = విూదజెప్పినతాడు ముంజయనుగడ్డిచే నిర్మింపఁబడినదగుచున్నది, ఊర్గ్వైముంజాః = ముంజాగడ్డి, బలస్వరూ

పము, ఊర్జమేవ=అందుచే బలమునే, అవరుంధే=పొందుచున్నాఁడు, చిత్రానక్షత్రింభవతి= అశ్వమేధయాగము ప్రారంభించు సమయమున చిత్రయను నక్షత్రము (ఉండవలసినది) అ గుచున్నది, యదశ్వమేధః= అశ్వమేధయాగమేదికలదో, ఏతత్కర్మ= ఈకర్మ (ఈ అశ్వ మేధము) చిత్రంవై = చిత్రమైనది. సన్నృత్యై = సుటియు కార్యసమృద్ధికొఱకునగుచు న్నదనుట.

బ్రాహ్మణము 3 కాండము 8 ప్రపాఠకము 5 అనువాకము.

32 బహుస్త్వైబహ్వశ్వాయై బహ్వజావికాయై బహువ్రీహియవాయైబహుమాషతిలాయై । బహుహిరణ్యాయైబహుహస్తికాయై । బహుదాసపూరుషాయై రయిమత్యైపుష్టిమత్యై । బహురాయస్పోషాయై రాజాస్తు ॥

టీ॥ బహుస్త్వై = అనేకగోవులు కలిగియున్నట్టిదియు, బహ్వశ్వాయై = అనేక గుఱ్ఱములు కలిగియున్నట్టియు, బహ్వజావికాయై = అనేకములైన మేకలు, గొఱ్ఱెలును కల్గినట్టియు, బహువ్రీహియవాయై = ఇచ్చట వ్రీహియవ, శబ్దములు ధాన్యవిశేషవాచకము, అనేక ధాన్యములు కలిగినట్టియు, బహుమాషతిలాయై = అనేకమైన మినుములు, నువ్వులు కల్గియున్నట్టియు, బహుహిరణ్యాయై = అనేక సువర్ణము కలిగియున్నట్టియు, బహుహస్తికాయై= విశేషముగ ఏనుగులు కలిగినట్టియు, బహుదాసపూరుషాయై = అనేకమయిన దాసవర్గము కలిగియున్నట్టియు, రయిమత్యై = అపరిమితధనయుక్తమై యున్న

ట్టివారు, పుష్టిమన్తైశ్చ = శరీరపుష్టిగల్గినట్టివారు, బహూనాం సహస్రిణః = అనేకమయినసు వర్ణమణిముక్తాది ధనసమృద్ధిగలిగియున్నట్టివారు, ప్రజలకు అనఁగామీఁద చెప్పిన లక్ష్మీసమృద్ధిగల ప్రజలకు ఈయజమానుఁడధిపతి (రాజా) అస్తు = అగుఁగాక.

బ్రాహ్మణము 2 కాండము 1 ప్రపాఠకము 8 అనువాకము.

38 ఐన్ద్రాగ్న ముపసాదితం । సర్వాభ్యో వా ఏష దేవతాభ్యో జుహోతి । యోగ్ని హోత్రం జుహోతి । యథాఖలు వై ధేనుం తీర్థే తర్పయతి । ఏవమగ్ని హోత్రీ యజమానం తర్పయతి । తృప్యతి ప్రజయా పశుభిః । ప్రసువర్గం లోకం జానాతి । పశ్యతి పుత్రం । పశ్యతి పౌత్రం ప్రప్రజయా పశుభిర్మిథునై ర్జాయతే । యస్యైవం విదుషో ౽గ్నిహోత్రం జుహ్వతి । య ఉ చైన దేవం వేద ॥

టీ॥ హోమముచేయుఁడగిన పాలు సర్వదేవతా ప్రీతికరమైనవి యనివాటి యొక్కస్తోత్రము చెప్పుచున్నారు, యేలాగు పాలు పిడుకుటకు తల్లిని పాలు పోయు చుండగా సప్పగా పాలు

వాయుదేవునకు ప్రియమైనవి పిలికున్న పాలు అశ్వినీదేవతలకు ప్రియమైనవి, పిలికినవి మిత్ర దేవునికి ప్రియము ఇట్లు క్రమముగ ఉపసాదితః= ఆహవనీయాగ్ని సమీపముగ నుంచబడినది, ఐన్ద్రాగ్నం=ఇంద్రాగ్నులకు ప్రియమైనది, యః=ఎవ్వడు, అగ్నిహోత్రి, జుహోతి=సకలదేవతా ప్రియమగు క్షీరద్రవ్యము నగ్నియందు హోమము చేయునో, ఏషః= వీడు, సర్వాభ్యః=సమస్తమైన, దేవతాభ్యః= దేవతలకొఱకు, జుహోతివై = హోమము చేయుచున్నాడు, యథాఫలం=ఏప్రకారముగా, ధేనుం= పాలిచ్చునట్టి గోవును, తీర్థే= తనకు సుఖకరమైన స్థానమందు (నిలపి) తర్పయతి మంచిగడ్డినీరు మొదలగువాని నిచ్చి తృప్తినొందింపుచున్నాడో, ఏవం = ఈ రీతిగ, అగ్నిహోత్రీ= అగ్నిహోత్రము, (అగ్నిహోత్రవిధుల నుపచరించు ధేనువుగాని) యజమానం= యజమానుని, తర్పయతి= తృప్తినొందింపుచున్నది, యజమానుడుకూడ, ప్రజయా= సంతానము చేతను, పశుభిః = పశువుల చేతను, తృప్యతి = తృప్తినొందుచున్నాడు, సువర్గంలోకం = స్వర్గలోకమును, ప్రజానాతి = తప్పక తెలిసికొనుచున్నాడు పుత్రం = కుమారుడును, పౌత్రం = మనుమలనుగూడ, పశ్యతి= తనజీవితకాలములో చూచుచున్నాడు, ఏవం = ఈరీతిగా, విదుషః = అగ్నిహోత్రమహిమనెరింగినట్టి, యస్య = ఏయజమా

మనిమొకః, అగ్నిహోత్రం = అగ్నిహోత్రమును, జుహ్వతి = అధ్వర్యులు మొదలగువారు హోమముచేయుచున్నారో, ఏవం = ఈచెప్పినరీతిగా, ఏనత్ = ఈచరిత్రము, యశ్చ = ఎవడయిన, వేద = తెలిసికొనుచున్నాడో వారికుపుషను, మిథునైః=మిథునరూపములైన, ప్రజయా = పుత్రాదులచేతను, పశుభిః = పశువులచేతను, ప్రజాయతే = సమృద్ధిగలవారగు చున్నారని తాత్పర్యము.

నిరుక్తములు.

నారాయణము 10 అనువాకము (మూలం)

34 చత్వారిశృంగాత్రయో అస్యపాదాద్వేశీర్షే సప్తహస్తా
సోఅస్య। త్రిధాబద్ధో వృషభోరోరవీతిమహోదేవో మర్త్యాగ్ంఆవివేశ॥
(నిరుక్తశాస్త్రము ఉత్తరషట్కము 7 అధ్యాయము 6 ఋక్.)

చత్వారిశృంగేతి వేదావాఏత ఉక్తాస్త్రయో అస్యపాదా ఇతిసవనాని త్రీణి ద్వేశీర్షే ప్రాయణీయో దయనీయౌ సప్తహస్తాస సప్తఛం

# ఆశీర్వచనమంత్రార్థము.

దాంసి త్రిధా బద్ధస్త్రేధా ఋగ్భోమంత్ర బ్రాహ్మణ కల్పైర్వృషభో రోరవీతి
రోరణమస్య సవనక్రమేణ ఋగ్భిర్యజుర్భిస్సామభిర్యదేన మృగ్భిశ్శంసన్తి
యజుర్భిర్యజంతి సామభిస్స్తువంతి మహో దేవ ఇత్యేషహిమహాన్ దేవో
యద్యజ్ఞో మర్త్యాం ఆవివేశేత్యే షహిమనుష్యానావిశతి యజనాయ తత్ర
సైష్యాప రాభవతి తతస్తోత్ర రాభూయసే శుభవచనాయ ॥

టీ॥ అస్య=ఈపరిణవస్వరూపుండైన పరమాత్మకు, చత్వారి= అకారము ఉకారము మకారము నాదము అనునాలుగున్ను, శృంగాః=కొమ్ములు, త్రయః=విశ్వ, తైజస ప్రాజ్ఞులను మూడున్ను, (విరాట్ హిరణ్యగర్భ= అవ్యాకృతములు) పాదాః=పాదములు (విశ్వతైజసప్రాజ్ఞులనగా, జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థల కభిమానియగు జీవుని నామాన్తరములు) ద్వే=చిత్తు అచిత్తు అను రెండును, (శక్తులు) శీర్షే=శిరస్సులు, అస్య= ఈతనికి, సప్త=భూలోకము మొదలగు యేడులోకములున్ను, హస్తాసః = చేతులు, వృషభః=ప్రణవస్వరూపియైన, ఈతడు త్రిధా= అకారోకారమకారములయందు, విశ్వ తైజసప్రాజ్ఞులచే మూడువిధములుగా, బద్ధః=కట్టబడినవాడై, రోరవీతి = తేజోరూప

ఆశీర్వచనమంత్రార్థ

మను మిక్కిలి ప్రతిపాదింపుచున్నాను మఱియు, మహాదేవః = ఈగొప్పదేవుడు,
మర్త్యాన్ = మనుష్యదేహములను, ఆవివేశ = అంతటను ప్రవేశించినవాడు.
(ఈయర్థము మూలమునకు సరిపడియుండుననుట.)

నిరుక్తమునకు సరియగు రెండవయర్థము వ్రాయుచున్నాడను ఎట్లనిన.

అస్య = యజ్ఞరూపుడగు నీయగ్నిదేవునికి, చత్వారి = ఋక్ యజుర్ సామఅథర్వాణ
ములను నాలుగు వేదములును, శృంగా = కొమ్ములు, త్రయః = ప్రాతర్మాధ్యందినసా
యంబులను మూడు సవనములును, పాదాః = పాదములు, ద్వే = ప్రాయణీయము, ఉ
దయనీయము, అనునీరెండును, (ఇవి యజ్ఞములందు మొదటను, తుదను, చేయవలసినవి)
శీర్షే = శిరస్సులు, అస్య = ఈతనికి, సప్త = గాయత్రి ఉష్ణిక్, అనుష్టుప్ బృహతీ
పంక్తిత్రిష్టుప్ జగతి అనునీయేడు ఛందస్సులును, హస్తాసః = చేతులు, మఱియువృష
భః = కోర్కెలను వర్షించునట్టి, యీతడు త్రిధా = మంత్రము, బ్రాహ్మణము, కల్ప
ము, అనుమూడు విధములుగా, బద్ధః = కట్టబడినవాడై, రోరవీతి = ఋత్విజులద్వా
రా స్తుతిరూపముగ ధ్వనిచేయుచున్నాడు, ఈమహాదేవః = గొప్పదేవుడు మర్త్యాన్

## ఆశీర్వచనమంత్రార్థము.

వివేక = మనుష్యులందు ప్రవేశించి తద్వారా సర్వాంతర్యామియని మహాపెద్దలు తెలిసికొనిరనుట.

### నారాయణము 10 అనువాకము (మూలం)

35 హగ్ంం సశ్శుచిషద్వసురం తరిక్షసద్ధోతా వేదిష దతిథిర్దురోణసత్ । నృషద్వరసదృతసద్వ్యోమసదబ్జా గోజా ఋతజా అద్రిజా ఋతం బృహత్ ॥ (నిరుక్తం ఉత్తరషట్కము 8 అధ్యాయము 28 ఋక్) హంస ఇతిహాఃసాసూర్యరశ్మయః పరమాత్మా పరంజ్యోతిః పృథివీవ్యాప్తేతి వ్యాప్తం సర్వం వ్యాప్తం వననకర్మణానభ్యాసేనాదిత్యమండ ప్రవేనేతిత్యయతీతి ॰॰ కొత్యయతీతి హంస యంత్యయతీతి హంసాః పరమహంసాఃపరమాత్మా సూర్యరస్మిభిః ప్రభాతగభీరవసతీతి త్రిభిర్వసతీతి వారశ్మిర్వసతీతి నావహిన్నిర్వసతీతివా, సువర్ణకేతాః పూషాగర్భారి భీతిరిక్షం

తావనకుటిలానికుటంతారిభం తాంతరిక్షాచ రత్నధాంతరిక్షాచరదితిదివి భువిగమనంవాసుభానుస్సుప్రభూతో హోతాదిత్య స్యగతాభవంత్య తిధిస్తురోణ సత్సర్వేదురోణ సద్ధ్రివం సర్వేరసావికర్షయతి రశ్మిర్వికర్ష యతి వహ్నిర్వికర్షయతివననం భవత్యశ్వగోజా అద్రిగోజా ధరిత్రీగోజా స్సర్వేగోజాఋతజాబహుళబ్రాభవంతి నిగమోనిగమద్యతి భవత్యృషే నిర్వచనాయతస్యైవహరాభవతి తస్యాస్త్రారాభూయసేశుభ వచనాయ ॥

టీ॥ హంసః=ఎల్లపుడు నడుచుచున్న సూర్యుఁడు, శుచిషత్ = వెలుగుచున్న మండలమందున్నవాఁడు, వసుః=అతిదేవాయుస్వరూపియై, అంతరిక్షసత్=అంతరిక్షమున నుండువాడు, హోతా=ఆహవనీయాద్యగ్నిహోత్రస్వరూపుఁడై, వేదిషత్ = వేదికల (కుండములు) యందుండువాఁడు, అతిథిః =అమావాస్య, ద్వాదశి మొదలగు తిథివిశేషములనపేక్షింపక కేవల భోజనార్థుఁడై తిరుగువాఁడతిథి, అయాతిథిస్వరూపుఁడై, దురోణ

సత్ = ఇతరుల గృహములయందుండువాడు, నృషత్ = మనుష్యులయందు జీవరూపముగా నుండువాడు, వరసత్ = క్షేత్రములగు కాశీరామేశ్వరాది పుణ్యస్థలములయందు పూజింపదగిన రూపముతో నుండువాడు, ఋతసత్ = సత్యము నందుండువాడును, వ్యోమసత్ = ఆకాశమునందు, నక్షత్రములు, గ్రహములు, మొదలగువాని రూపముగ నుండువాడును. అబ్జాః = నదీసముద్రోదకములవలన శంఖములు మకరములుప ద్మములు మొదలగురూపముగ పుట్టుచున్నవాడును, గోజాః = పాలు పెరుగు మొదలగువాని రూపముగ గోవులవలన బుట్టుచున్నవాడును, ఋతజాః = సత్యముచెల్లపుడు పల్కుచున్నందున వచ్చుకీర్తిరూపముగ సత్యజాతుడును, అద్రిజాః = పర్వతమువలన చెట్లుమొదలగువాని రూపముగ పుట్టుచున్నవాడు, (ఈ చెప్పినదంతయు కార్యస్వరూపమేయనియభేదము) ఋతం = పై జెప్పిన జగత్స్వరూపముసత్యము బృహత్ = మఱియు (నజ్ఞానులకు జగద్రూపముగను) (జ్ఞానులకు పరబ్రహ్మరూపముగను) భాసమానముగుచున్న నిత్యముగు సత్యపదార్థమని భావము.

బ్రాహ్మణము 1 కాండము 3 ప్రపాఠకము 6 అనువాకము.

36 శతమానంభవతి। శతాయుః పురుషశ్శతేంద్రియః । ఆయుష్యేవేంద్రియే ప్రతితిష్ఠతి ॥

టీ॥ (శ్రౌతస్మార్తక్రియలలోను దక్షిణాదిరూపముగ నుపయోగింపఁబడు బంగారము) శతమానం = మానమనఁగా పణములో నిరువదవభాగము, అనఁగా నైదుపణములపరిమితిగలది, భవతి = అగుచున్నది, పురుషః = పురుషుఁడు, శతాయుః = నూఱేండ్లుజీవితకాలముగలవాఁడు, శతేంద్రియః = నూఱింద్రియములుగలవాఁడు అనఁగాజ్ఞానకర్మేంద్రియములు పదియు మొత్తం పదియగును, వీనిలో నేత్రము మొదలగు నొక్కొక ఇంద్రియమునకు దర్శనాదులయందు వృత్తిభేదమువలన శతేంద్రియత్వము సిద్ధించును, నివినూఱుమానముల (అయిదుపణములు) పరిమితిగల బంగారమునిచ్చినందువలన, ఆయుషి = శతసంవత్సరాయుర్దాయమునందును, ఇంద్రియే = ఇంద్రియసంఘమందును, ప్రతితిష్ఠత్యేవ = తప్పకప్రతిష్ఠనొందియుంటున్నాఁడు, అనఁగా అవయవపటుత్వముతోఁగూడ నూఱేండ్లు జీవించవచ్చునని తెలుపుచున్నది గ్రంథముసమాప్తము.

# విజ్ఞప్తి.

ఆశీర్వచనమంత్రార్థము నెఱుంగక చేయు ఆశీర్వచనము వ్యర్థమని పెద్దలు చెప్పెదరు. కనుక ముందుగా మంత్రార్థము తెలిసికొని పిమ్మట ఆశీర్వచనము చేయుట శ్రేయస్కరమైన పనియని చదువరులే తెలిసికొనగలరు కొందరు నామిత్రులతో ఈగ్రంథమును ముద్రింపుడని యిదివరలో కోరుటచే ఈగ్రంథము ముద్రింపించి ప్రకటించుటకు నావద్ద ద్రవ్యసహాయము లేనందున సుప్రసిద్ధులును బహుగ్రంథములను ప్రకటించుచుండు మచిలీపట్టణ నివాసులగు బ్రి॥ చల్లా లక్ష్మీనృసింహశాస్త్రి గారికి ఈగ్రంథమును బంపించివేసితిని. పిమ్మట వారున్ను వారిస్వకీయ, ముద్రాక్షరశాలయందు వెంటనే ముద్రింపించి ప్రకటించినందున నాశ్రమను సార్థకము చేసినవారైరి. ఈగ్రంథమును కలయువారందఱు మచిలీపట్టణమునందుండు ఆర్యానంద ప్రెస్ వారికి వి,పి, టపాలో గ్రంథమును తెప్పించుకొనగలరు.

ఇట్లు విన్నవించు,

పారనంది సర్వేశ్వరశాస్త్రి.

